# అంతర్వేది సంగ్రహము.



జనము కిటకిటలాడుచుండిరి. స్నానము చేసి వచ్చువారు, స్నానమునకు వెళ్ళువారు, వచ్చినజనమును జూచువారు— అంతయు హడావిడిగ నుండెను. ప్రొద్దెక్కినకొలఁది జనసమ్మర్ద మెక్కు వగుచుండెను. లంగాలు కట్టి, జాకెట్లు తొడిగి, యొయ్యారముగ బోవుచున్న విలాసవతులటుక్కు టెక్కులు చూపరులదృష్టి నాకర్షించి, హృదయమును గలత నొందించుచుండెను. అంతర్వేదినరసింహస్వామితిరునాళ్ళు— తిరునాళ్ళా? తీర్థమా? —రెండు ననవచ్చునేమో —చూడ వచ్చినపురుషపుంగవులలోఁ జాలమంది బిబ్బోకవతులం గాంచి తబ్బిబ్బుపడనివారు లేరు. అంతటి పెద్దతీర్థమునందు సైతము స్త్రీయే రాణియై పురుషమండలిని శాసించుచుండెను.

ఇంకను స్టీమరును, పడవలును చాలమంది జనమును తీసికొనివచ్చి దింపుచుండెను.

అంతర్వేదితీర్థము గోదావరీమండలమున గొప్పప్రసిద్ధి నెక్కినది. ఈతీర్థమున కేటేట వేలకొలఁది జనము వచ్చుచుందురు. తీర్థసమయమునను మడిసంచులను భుజమునఁ బెట్టికొని, విభూతిరుద్రాక్షలు దాల్చి, మోకాలు దిగనితడియుంగ వస్త్రములనో, నారబట్టలనో కట్టుకొని, జారీచెంబులతో, దర్భాసనముతో దారి కొఱకు ప్రక్కగ నొత్తిగిలి జనసమ్మర్ద

మును దప్పించుకొనుచు, మైలపడకుండ జాగ్రతగఁ జూచు
కొనుచు వర్ణశిష్టాచారసంపత్తిగల బ్రాహ్మణబృందమును
గాంచిన వేదశాస్త్రపురాణోక్త హిందూమతాచారశోభిత
మైన ప్రాచీనహిందూదేశవిజ్ఞానపరిభావమును. ఇచ్ఛవచ్చి
నట్లు స్వైరవిహారము సల్పుచు నీటుగోటులకును, కడకు
బెడఁగులకును మనికిపట్టులై విలాసము మూర్తీభవించినట్లు,
సొగసుందనము పొంగి పొర్లి కొనగిలఁబడుచున్నట్లు, మాయ
యెలు రూపము దాల్చికొనినట్లు కనబడుచు హసనకాండ్రంగాంచిన
నాధునికహిందూదేశవిజ్ఞానానుభావమును హృదయమునకుఁ
బొడకట్టి ప్రాచీనప్రాచీనతల గుణావగుణములను వెల్ల
డించుచు, నాశ్చర్యసంభ్రమములను గలిగించి యొడలు పుల
కరింపఁ జేయుచుండును.

రామదాసుల కీర్తనములును, పాటకజనంబుల రామ
భజనలును, హరిభక్తుల కోలాటంబులును, వీథిభిక్షుకుల యవి
రత దీనాలాపంబులును జనమండలినుండి పైకెగసి, యాకస
మును చిల్లులుపఱచుచుండెను. గవ్వలును, పైసలును, బియ్య
పుగింజలును దానముచేసి మార్గమున కిరుప్రక్కలనున్న భిక్ష
కులను తనుపుచుఁ బోవు సుస్నాతలైన పుణ్యాంగనలును,
వెంతంతుపులును, పురుషులును గూడ లెక్కకు మీఱియుండిరి.
మడకాళ్లు కట్టుకొని నడచువారు, శంఖనాదము బూరించుచు
గంటవాయించుచు పదములుపాడు జంగమదేవరలు, ముక్కు
ంచెఁ పైఁ [illegible]

కొని స్నానముచేసి వచ్చువారివెంట బిచ్చమడుగుచుఁ బరువు
లిడువారు, ఇటునటు త్రిప్పి డబాబ వాయించుచు టిక్కీ,
లమ్ముచు చిల్లరబేరగాండ్రు, ఏసుక్రీస్తునుగూర్చి యుపన్యాసము
లిచ్చుక్రైస్తవమతబోధకులు, పుస్తకములను గూర్చిన ప్రకట
నలను జూచుచుండఁ జింపివేసినను, పారవేసినను గూడఁ బంచి
పెట్టుచునే యుండు ప్రకటనలు, తీర్థముయొక్క వైశిష్ట్యము
నొకమూలఁ బెంపొందించుచుండ, జలదృష్టులంబఱపుచుఁ
నిటునటు చూచుకొనుచు హాయిలుగఁ బోవు మందయానల
నడకసొంగసు దిలకించి యుప్పొంగుచు నువ్విళులూరు
పకాసుకాండ్రును, చూపులకును జూపులకును గొంత పరిచ
యము గలిగినంతనే దపఁ బైటకొంగులు లాగుదిట్టరులును, తక్కు
చు, దారుచు జారెడు రసికులు యంగసౌష్టవముంగాంచి
తలకంపించి ఘోవమూను నీటుకాండ్రును, సరసనె నడచుచు,
పైపైనఁ ద్రోసికొనుచుఁ జీరచెఱఁగు తగిలినయంతనే, శరీరస్ప
ర్శ గలిగినంతనే హృదయేశ్వరీమను ధన్యోస్మి ధన్యోస్మియని
ధన్యవాదమొనరించుచు, నొసపుచూపులను గడుసుదనముగ
జిలుగుపువ్వులతోఁ బ్రత్యుత్తరము లిచ్చు రసికశేఖరులును
తీర్థము యొక్క రామణీయకత నొకమూల వృద్ధిసేయుచుండఁ,
నిరుపక్షములవారినిఁ గనుఁగొనుచు సర్వము తమకుఁ దెలిసి
నట్లు, తాము మానవాతీతులైనట్లు పేంశనసేయుచు, నాక్షే
పణ లొనరించుచుఁ గులుకుచుండు విమర్శకులు తీర్థము
నొక్క వెగటుతనము నొకమూల నెత్తి చూపుచుండ, నట

వివిధప్రకృతుల కాకరంబగు మానవత్వమై, భిన్నభిన్నములగు గుణాలకు శరణ్యమైనశేఖరత్వమై వెలయుచుండెను.

ఇట్టి మహాతీర్థమున పిల్లలు-పిల్లలే, కాదు, పెద్దలుకూడ తప్పిపోవుచుండిరి. బంధువులు మాటిపోవుచుండిరి. స్నేహితులు మాటుమాయ మగుచుండిరి. పరిచయస్థులు విడిపోవుచుండిరి. ఇట్టిసమయమున నొక్కకాంత యిటునటు త్రిప్పుకొనుచు, వచ్చుచు పోవువారింజూచి ముసిముసినవ్వులు నవ్వుచు, ముందుచూపేకాని వెనుకచూపుచూడక సముద్రమునకు స్నానముసేయనరుగుచుండెను. కొంతదూరము పోయినతరువాత నామె పాడుపడియున్న దీపగృహము(Light House)నంకొకయుచూపి ఆరాతిస్తంభ మేమిటరా?, యని కూడ వచ్చుచున్న తననాతి నడిగెను. కాని యడిగినప్రశ్నమున కెంతకును సమాధానము రాకపోవుటచే నామె వెనుకకు తిరిగిచూచెను. తన వారు కనిపింపలేదు. ఇటునటుచూచెను. వెనుకంబడిరేమో యని కొంతసేపు ఆగి వారికై వెదకెను. ఎంతకును వారిజాడ కానరాక పోవుటచే దొట్రుపడి పేరుపేరున వారిం బిలువం జొచ్చెను. ఆపిలుపులకును బ్రత్యుత్తరము రాదయ్యెను. అప్పుడామె దిక్కుమొగమునైచి కొంతదూరము వెనుకకరిగి వారినరయం బోయెను.

అట్లు పోవుచుండగా నాకస్మికముగ నలుగురైదుగురున్నగుంపునుండి యొకండు పరుగుపరుగున ముందునకు వచ్చి యామెచేయి పట్టుకొని

"ఆగు; ఆగు. ఇప్పు డెక్క డికి తప్పించుకొని పోవు దువు? ఓసిదొంగముండా! మాకళ్ళలో దుమ్ముగొట్టి యెంతపని చేసి పోయితివే! ఇప్పు డెక్కడికి వెళ్ళెదవు?—ఊఁ"

అని బిగ్గరముగఁ బెద్ద సంరంభము సేయుచుండ, వెను కనున్న నలువురును ముందునకు పరుగిడివచ్చి

"అమ్మ! ఎంతటి హానినైన నగుదువే! యింతకొంప కొం తటియల్లరి తెచ్చిపెట్టినావే! తిన్నగఁ దిని కూర్చుండలేక గోక మా? జాడ్యమా? ఈలాగు పాఱిపోవు వచ్చెదవా?"

అని నిర్బంధించెదొడఁగిరి. వీరిట్లనుచుండఁగనే ముందుగ వచ్చి యామె చేయి పట్టుకొనిన యాతఁడామెను రెండుగుద్దు లుగుద్ది 'రా. ఈపాటికి వెళ్ళెద' మని యామె నీడ్చుకొని పోవఁ జొచ్చెను.

కాని యాంపగతి యేమియు నాకు కర్థము కావయ్యె ను. అతఁడంత మోటువారితో గుద్దుటయుఁ, జేయిపట్టు కొని లాగికొనిపోవుటయు, వెనుకవారట్లు వచ్చి నిందించుట యుఁ జూచి యామె పోలెనోయి, తెకనుకచూపులం జూచి, కొంతవడి ఆర్చుపడి, నిర్ఘాతపోయి కొంచెము సేపైన పిదపఁ దెలివి తెచ్చుకొని

'ఏమిటిది? నాచెయ్యి వదలు; నీజిహ్వలాగ. నన్నట్లు గుద్దెదవేమిరా? నీకేమి 'పొయ్యేకాలము, వచ్చినదిరా నీచేతులు పడిపోను"

"బాబూ! చూచితిరా! అమ్మా చూచితిరా! ఈతఁ డుదయముండకొడు కెవ్వరో నా చెయ్యి పట్టుకొని నన్ను రెండు గ్రుద్దులు గ్రుద్ది, నేను నగలు తీసికొని పోయినా నని, యింటికి వచ్చి నన్ను కాపురము చేయవలసిన దని యేమేమో యర్థములేని కాఱు లఱచుచున్నాఁడు. ఈతఁ డెవ్వరో నే నెఱుఁగ. ఈతని నగ లేమిటో నే నెఱుఁగ. ఈ కాపుర మేమో నాకర్థమగుటలేదు. అక్రమముగ నీపాపిష్ఠి ముండకొడుకులు నన్నెట్లల్లరి పెట్టుచున్నారో! అయ్యలారా! చూచుటలేదా? మీ కాడుతోడు లేదా? పట్ట పగ లింతటి ఘోరమును మీ రెవ్వరైనఁ గన్నారా? విన్నారా? అయ్యో! మీ రట్లు చూచుచు నూర కుండెద రేల? మీకు హృదయము లేదా? ఎవరు దిక్కు నాకిఁక? నన్ను రక్షించు వా రెవరు?"

అని వాపోవఁజొచ్చెను.

ఆమె యట్లఱచు చుండఁగనే యవతలిపక్షమువారు "అయ్యా! ఈ వగలాడి మాటలను నమ్మకుఁడు. దీని యత్తవారి యూరు దాకమూరు. ఆ చేయి పట్టుకొనిన యాతఁ డామె మగఁడు. ఏవియో భార్యాభర్తలకుఁ దగవులు పుట్టినవి. చాలకాలమునుండి యింటిలో నీగందరగోళము నడచుచున్నది. ఇట్లుండఁగా నొకనాఁటి రాత్రి యెవ్వరికిని దెలియకుండ నీమె కొన్ని నగ లెత్తుకొని పోయినది. చాలకాలమునుండి యాతఁ డామెను వెదకుచున్నాఁడు. నేఁటి కిచ్చట కని

పించినది. సంగతి యిది. ఇంక నీతఁ డెవరో తెలియదని, నగ లెఱుఁగ నని పెద్ద బొంకు బొంకుచున్నది."

అని నలువురి కెఱుఁగఁ జెప్పి

"పడదోసి తన్నవోయి పాడుముండని, వెంకయ్యా!

అని హెచ్చరింపఁ జొచ్చిరి. వెంకయ్యయు వచ్చిన నలువురి తోను

"అయ్యా! దీనియత్తవారి యూరు దాకవచ్చియుగునో కాదో కనుఁగొనుఁడు. దీనిపుట్టినిల్లు నవ్వులగుంట. చెప్పకొనిన సిగ్గులచేటు—నన్ను వదలివేయుటయే గాక నగలుకూడ నెత్తుకొని వచ్చియెఱుఁగ ననుచున్నది. చూచితిరా దీనివేషము! ఎంతటిదాననైతివే! నీ పిక్కలు విఱుగఁ బొడిచినను నాకేమైనఁ బాకమున్నదా? రా రా. ఈపాటి కింటికి వెళ్లుదము రా"

అని హెచ్చరింపఁ జొచ్చెను.

„గంగమ్మా! మామాట విను. రా. ఎందుకు లేనిపోని యల్లరిపడెదవు"? అని వెంకయ్యతో వచ్చినవా రనుచుండిరి.

„నాకిదేమిగ్రహచారము వచ్చినదోయి దేవుడా!—"

అని నలువురితో „బాబూ! మీ రెవరో నే నెఱుఁగను. ఇతఁడు నామగఁడు కాడు. వీరిని నే నెఱుఁగను." అని గంగమ్మ విలపించుచుండెను.

అప్పుడు „మీయత్తవారి యూరు దాకమచ్చియేనా?" యని చూపఱులలో నొకఁడు ప్రశ్నించెను. 'అవు' నని యా

మె శ్రీత్యుత్తర మొసంగినమీఁదట, నీ పుట్టినిల్లు నవ్వుల గుంటయేనా?" యని మఱియొకఁ డడిగెను. 'అవు' నని యా ప్రశ్నకు సమాధానము వచ్చెను.

"చూచితిరా! గొప్పగొప్ప ప్రభువు లందఱు చిత్త గించుచున్నారా?" యని వెంకయ్య యాజవాబుల కొత్తియ్యఁ గడంగెను.

"కాని నామగఁ డితఁడు కాఁడు. నే నితని నెఱుఁగ" నని గంగమ్మ వాదించెను.

"అట్లయిన నిమగని పే రేవ" రని యచ్చట నిలుచుండియున్న వారిలో నొక రడిగిరి.

"అతని పేరు వెంకయ్యయేగాని యీ వెంకయ్య కాదని యామె యాక్రోశించెను.

"చూచితిరా! ప్రభువులందఱు చిత్తగించుచున్నారు కదా! చూచితిరి బాబు! ఇన్ని యొప్పుకొనుచున్నది కాని నగల మాటయొద్దనే వచ్చుచున్నది పేచి."

అని వెంకయ్య పలుకుచుండెను.

"నీవు నా మగని వంటరా? నా మగఁడవా? నీతల్లిబ్రద్దలవ! నీయిల్లు మాసి పోవను." అని గంగమ్మ తిట్ట మొదలుపెట్టెను.

"నేను నీ మగఁడను కాను? కాకపోతే కాకపోయెదము లే.—ఓసి! ఎంతవఱకు ముదిరినదే నీ తిమ్మిరి. ఉఁ—చూడు. ఈలాగు బుకాయించినఁ దీరిపోవును కదాయని యనుకొ

నుచున్నావా? నేను నిన్ను వదలి పెట్టను. నా నగలమూట ఏదో చెప్పు. లేకపోతేరా. పోలీసుస్టేషనుకిరా. తీసికొని వెళ్లెదను."

అని వెంకయ్య యామెను బలాత్కారముగ నీడ్చికొని పోవం జొచ్చెను. చూడ వచ్చినవారిగందరగోళమును జూచి నవ్వి, వీరు చెప్పుమాటలకు, నామె యిచ్చు సమాధానములకుం జాల పోలికయున్నందునను, నగలమూట తక్క కడమ సంగతు లన్నియు నామె యొప్పుకొనుచునే యున్నందునను, "స్టేషనుకు వెళ్లిన మోసము వాళ్లు నను భీతిచే గాంబోలు వచ్చుటకుం బోవ నిష్టము లేక యీాగిలాగ బడుచున్నది. ఇందువలన నీమె నిజముగ వెంకయ్యను మోసము చేసిన" దని నమ్మి చూపఱులు వారి సంభాషణకు నవ్వుకొనుచు నట నుండి కదలి పోవు చుండిరి.

అంతటి బలవంతము మీాందనుగూడ గంగమ్మ గానుు, మొర్రో. నాకేదేమి గోల వచ్చెను రా' యని యఱచు చున్నను వెంకయ్య స్టేషనుకు వచ్చుట కిష్టము లేక పోయిన రా యింటికి పోవుదము. లేదా నా నగలు తెమ్మని గూమె నదలించుచు నీడ్చుకొని పోవుచునే యుండెను.

కొంతసేపటికి వా రామెను తీర్థముకొరకై తాత్కాలికముగం బెట్టిన స్టేషను యొద్ద కీడ్చుకొని పోయిరి. అచ్చట వెంకయ్య తన స్నేహితులను సాక్షులుగా జేసి యామె మీాద ఫిర్యాదు చేసెను. ఒక్కొక్క కాన్స్టేబిల్ వచ్చి యామెను దేరిపాఱంజూచి వెడలి పోవుచుండెను.

౯ నే గంటను బిగ్గోషిని. ఇతఁ డెవ్వఁడో నే నెఱుఁగ. ఇ తేఁడు నా మగఁడు గాఁడు. నే నీతని భార్యనుగాను. ఇతఁడు చెప్పినంగతులన్నియు నబద్ధము” అని యామె మొఱ్ఱ పెట్టు కొనుచు గోల పెట్టుచుండెను. కాని పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరుగా రగు సుందరశివరావుగారు సాక్ష్యము పలుకవచ్చిన వారి వేషములను జూచి, మధ్య మధ్య వారు పొరపాటులక్రింద దగిలించుచు వచ్చిన రెండింగ్లీషుముక్కలను విని వారిరువురు గొంచెము ‘పురానా’ మనుష్యులలోఁ జేర్పఁబోదగినవారుగఁ గన్పట్టుచున్నారని తలంచి, వారిసాక్ష్యము మీఁద నామె నదలించి, బెదరించి యామెను సెకయ్యతో బంపివేసిరి. వెంక య్యయు, నాతని స్నేహితులును నామెను బలవంతముగ గుఱ్ఱపుబండ్లలో గూర్చుండఁబెట్టుకొని పోవఁ దొడంగిరి.

అప్పటికి మధ్యాహ్న మయ్యెను. సూర్యుఁడు నడి నెత్తిమీఁదికి వచ్చెను. సముద్రస్నానము తగ్గి జనము పలుచ నయ్యెను. ఒక్కరొక్కరె పురుషులు స్త్రీలు యింటిలో, అన్నసత్రములలో జేరుకొనఁ జొచ్చిరి. మఱికొందఱు కట్టెలుతెచ్చి ప్రొయిలు వేసి వంటకుద్యమించుచుండిరి.

అప్పుడు ‘గంగమ్మో’ గంగమ్మ’ యని రోదనముచే యుచు నొక ముసలిది వెంట రాఁ బదియేండ్ల ప్రాయము గల యొకఁడు వెఱ్ఱిచూపులు చూచుచు జనమునందెవరికోస మో వెదకుచుండెను. గాని యాతని ముఖవైఖరి నుపలక్షించిన

నాతని యారాటమును, వేదనయుమాత్రము తప్పలే దని చెప్పవచ్చును.

ఇంతలో మఱికొందఱు వారిని వచ్చి కలిసికొని 'ఏమి, ఎక్కడను గనఁబడలేదా ? అయ్యో ! ఇదేమి టమ్మా! ఇట్టే మాయమైనది. మాయగుంపు ఎప్పుడు వచ్చి పడినదో ? మాయగుంపు తోసికొని వచ్చినారు. తండాలు తండాలుగ వచ్చి మీదఁబడి చెదరఁగొట్టితే!—ఏమని చెప్పను! అమ్మా! ఎక్కడి కలుగు నాకొడుకు లమ్మా! అయ్యో అయ్యో' అని విలపించుచుండిరి. 'నందు మొగదాటినదాక కూడనేయున్నదమ్మా!' అని యాగుంపులో నొకరు వచించిరి. 'తండా వచ్చి చన్న దని మఱి మాసందులోనికి తిప్పుకొంటిమి. అప్పుడే యది, మఱి మా కైనది.' అని వేఱొకతె పలికెను. 'అదిగో—పిల్లవాఁడెవరో తప్పి పోయినాఁడుట. చాటించున్నారు—పాపము ! అబ్బబ్బ ! ఈ మాయతీర్థములకు రాఁగూడదమ్మా !' అని వేఱొకతె వైరాగ్యప్రసంగము చేసెను. వీరి స్థితి నంతయుఁ జూచిన మఱియొకరు 'అయ్యా ! ఈ సంగతి పోలీసు స్టేషను యొద్ద తెలియఁజేసిన మంచిది. చాటింపైన వేయించఁడి ఆమె తప్పి పోయినదని' అని సలహా నిచ్చిరి. 'అటులనే' యని వారా పోలీసు స్టేషనుకు వెళ్ళి యచ్చటి యధికారులకు సంగతి నివేదించి 'మనిషి చామన చాయగ నుండును. ఇరువదినాలు గేండ్ల ప్రాయము. కొంచెము శరీరము

పుష్టిగ నుండి లావుగ నున్నను, పొడుగునకుఁ దగిన లావగుట నది యొక లావుగఁ గనిపించదు. గుండ్రని ముఖము. వాలుకన్నులు. నుదుట నొక చిన్న 'చట్టకాల్పు' మచ్చ యుండును.' అని మనిషి 'చహారా" చెప్పిరి.

అంతట నాపోలీసువారు 'అయితే ఆమె గంగమ్మ కాదు; దాకమ్మత్రి యత్తవారు" అని యడిగిరి. 'అవు' నని వారుత్తరు విచ్చిరి. అప్పుడు పోలీసువారు నవ్వి 'ఏమయ్యా! ఆమె కొంత కితగఁ బలవించుచున్నారు! ఆమెనుగఁ డామెను దీసికొని పోయెను. ఆమె మీకేమి కావలయును?" అని ప్రశ్నించిరి. కడపటి మాటలను వినిపించుకొనకయే యాపురుషుఁడు 'మగఁడు తీసికొని పోయెనా? మగఁడెవరు?' అని రక్తము ముఖమున కెగదట్ట, కన్నులలోఁ గళవళము సందడింప వారి నడిగెను.

'గులాబిరంగునల్లంచుజరీచీర కట్టుకొనిన యామె మాంయేనా మీ రడుగు నది—పుట్టినిల్లు నవ్వులగుంట.

'అవును. ఆమెయే'

'ఆమెమాటయే మేము చెప్పునది—మగనిపేరు వెంకయ్య కాదు?' అని పోలీసు వారు ప్రశ్నించిరి.

'అవును. వెంకయ్యయే. ఆ వెంకయ్య యెవరు?—నేనే నండి.'

'నీ పే రెవరు?'

'నా పేరు వెంకయ్య. ఈమె నా తల్లి.'

'మరే బాబు. గంగమ్మతల్లి నా కోడలు బాబు!' అని యామె సెలిది యనెను.

'బలే' గా నున్నది. వెంకయ్యయనుచు నెవరోవచ్చి యామె నా పెండ్లా మనుచు, నేవిమో నగలు తీసికొని రాత్రికి రాత్రి లేచి వచ్చినదని చెప్పగ విన్నాను.

'అదేమిటి ? నగ లెత్తుకొని వచ్చినది? ఎవరిది? రాత్రికి రాత్రి లేచి వచ్చినది ?—ఏమిమాట లివి ?—వారెవరో మరియొకరు కాబోలు! '—

'కాదయ్యా! ఆమె పేరు గంగమ్మ. ఇంటిపేరు పెంకుటింటివారు కాదు?'

'అవును. ఇంటిపేరు పెంకుటింటివా రేనండి.'

'మరి యింకేమి ? కా దంటా రేమి ?'

'ఆమె నాభార్యయండి. లేచి రా లేదు. నగ లెత్తుకొని రా లేదు—'

'దానిమగఁడు వెంకయ్యయు, నతని బంధువులు మాకు సంగతు లన్నియుఁ దెలియఁ జెప్పినారా? మాచెవులను మేము నమ్మవలెనా లేదా?'

'వెంకయ్యా?—వెంకయ్యను నేనే. నాపేరు వెంకయ్య. గంగమ్మ నాభార్య. '

ఇంతలో వచ్చిన సుందరశివరావుపంతులుగారు సంగతి యంతయు వినిని నవ్వుచు 'ఇదేమిటి? విచిత్రముగానున్నది కథ. నా పెండ్లము. నా పెండ్లా మంటే కాఁబోలు ననుకొని యామె

ను మొదలించి యీ వెంకయ్యతోఁ జెప్పి వేసితిమి.' అని వచి
ంచిరి.

ఇది యంతయు వినుచున్న బంధువులకును, వెంకయ్య
కును నాశ్చర్య విషాద భయములు లొక్కుమ్మడి నావహించి
వారిహృదయమును గలవరపఱిచెను. ఇంక నంతకన్న నెక్కు
వమాటలాడిన నేమికొంప మునుఁగునోయని పల్లెటూరివా
రగుటచే భీతిలి దిగులుపడి యేమిచేయుటకును దోఁచక
కాలు కాలిన పిల్లివలె నిచ్చటకు నచ్చటకుఁ దిరుగఁజొచ్చిరి.
వారచ్చట నుండి వెడలి పోవునపుడు 'నేనును నాయోపిన
సహాయము చేయుదును. పోలీసు కనిస్టేబులచే నామెకొఱకు
వెదకింతు' నని సుందరశివరావుగారొక విధముగ వారినోదార్చి
యూరడించి పంపివేసిరి. వారట్లు దినమంతయు విషాదార్ణవ
నిమగ్నులై, తమకాళ్లెట్లు గొనిపోయిన నట్లుపోవుచుండిరి.

సాయంకాలము రెండు గంటలు లేక, మూఁడుగంట
లగునప్పటికే రథమలంకరింపఁబడెను. రంగుకాగితముల
జెండాలతోను, కలంకారి గుడ్డలతోను నారథము హొయలు
మీఱియుండెను. రథముయొక్క క్రిందియంతస్తుమీఁద భజన
సేయువారు కూర్చుండియుండిరి. పైయంతస్తుపై ముందు రెండు
లక్కగుఱ్ఱములు డాలుగ క్రొత్తరంగుతో మెఱయుచుండెను.
వాటిపై కాగడలు పట్టిన యిరువురు వైష్ణవబాలురు కూర్చుం
డిరి. స్వామికి కుడిప్రక్క స్వస్తి చదువుచు వైష్ణవులును,
కొందఱు పేరూరుబ్రాహ్మణులు నుండిరి. పైయంతస్తులమీఁద

నెవరో యిసుప్రసుపల్లె వాం కుప్రికూర్చుంచి రథముపై కెగుర వేయుచుచుండిన యరఁటిపండ్లను తినినన్నితిని మిగిలినవి ప్రోగు చేయుచుండిరి. రెండవయంతస్తుమీఁద రెండు గుఱ్ఱములకు నడుమ నొక సారథివిగ్రహ ముంచఁబడెను. ఆవిగ్రహము ముందు వైష్ణవుఁ డొకఁడు నిలువఁబడి త్రాడులాగ నున్నవారిని హెచ్చరింపుచుండెను. రెండవయంతస్తు గోపల సింహాసనము వంటి యొక యిత్తడియుయ్యాలలో స్వామిని గూర్చుండఁ బెట్టిరి. స్వామి కిరు గెలంకుల కాగడలు వెలుఁగుచుండెను. చక్రరక్షకులు గునపములతోను, దూలములతోను, దుంగల తోను, చక్రములను మొట్టగించుచుండిరి. త్రాడులాగుటకు జనులు నడుములు కట్టి సిద్ధమైవచ్చి 'గోవిందా' యని యఱ చుచుండిరి. కొంతసేపటికి రథము—మొగలితుర్రి కలిదిండి వారు రామరాజుగారు త్రాటిమీఁదఁ జేయి వైచినంతనే యని చెప్పుదురు—కదిలెను. కదలుట తడవుగ నదిపరుగిడిపోయెను అంతర్వేది నరసన్నను చూడలేక పెడమొగముఁ ద్రిప్పుకొని యున్న గుఱ్ఱాలక్క-గుడియొద్దకు రథమనతికాలముననే పోయెను. అచ్చటఁ గొంతసేపాగి మఱలివచ్చెను. నాఁటి రాత్రి యచ్చట భాగవతమాడిరి. ఇంత దూరమును 'గంగమ్మ మగఁడు, గంగమ్మయత్తగారు' నని చెప్పుకొనినవారుకూడ రథముతో నడచిపోయిరి. వారానాఁడు తీర్థమంతయు విసుపు నసుపు లేక కలయ వెదకిరి. కాని గంగమ్మ వారికిఁ గనిపింపలేదు. తుదకు వారు మఱల భాగవతమాడుచోటునకు వచ్చి

యచ్చటికిఁ గొంతదూరమున బసచేసి, యింత యుడకవేసి కొని తిని యేమియుం దోఁచక యూబయలున వెన్నెలలోఁ బరుండిరి.

కొంతసేపటికి భాగవతము జరుగుచోటఁ దక్క యంతయు నిశ్శబ్దముగనుండెను. యామములు కడచెను. చల్లనిపిల్ల వాయువులు వీవ మొదలుపెట్టె త్రైర్థికుల శ్రమయింతుక యుపశ మింపఁదొడంగెను. శీతమయూఖుఁడు సకలలోకసుఖప్రదం బుగ జిలుగు వెన్నెలలను రాల్చుచు నంబరవీధిని సుఖప్రయాణ మొనరించుచుండెను. అప్పటి ప్రకృతి యొక విధముగ నశోషవాయువులను వెదజల్లుచునే యున్నను నది శోకా కులచిత్తులగు వారికి మాత్రి మానందము నొసఁగూర్పఁ జాల దయ్యెను. ఆ తక్షోకము బహిరానందమున విలుప్తమగునా? అనాటి చల్లని పేటవెన్నెలలందును దుఃఖించువారు దుఃఖిం చుచునే యుండిరి. శోకించువారు శోకించుచునే యుండిరి. తప్పి పోయిన తమవారికొఱకు వగచువారివగపులును, పోగొట్టు కొనిన తమవస్తువులకై వీక్షించువారివిలాపములును, తాత్కా లికముగ నన్యోన్యసమావేశమైన రమణీరమణుల సరస సల్లాపములును నెడనెడ బైలువెడలి ప్రకృతియొక్క యథా ర్థపరిస్థితిని దేటపఱచుచుండెను.

‘అమ్మా! నాకోడలో నాకోడల గంగమ్మా, గంగ మ్మ, యని గంగమ్మయత్తగారని చెప్పుకొనిన యాముసలిది యిప్పటికి నేకూనిరాగమో తీయుచునే యుండెను. కాని

క్రమక్రమముగ నన్నగిలుచున్న వెన్నెలతోఁబాటు ఆమెకంఠ స్వరము కూడ నన్నగిలుచుండెను.

* * * *

కొందఱు మనుష్యుల సందడి వినిపించుచుండెను. కొంత సేపటి కా సందడి పోరాటముగ దిగినట్లు తెలియవచ్చెను. పిమ్మట నీక్రిందివిధమున మాటలు వినఁబడెను.

"సంగతు లన్నియు మొదట నేర్పుతోఁ గనుఁగొని మీకుఁ జెప్పినందులకా నానోట కరక్కాయఁ గొట్టుచున్నారు. నేను దాని యూరుపేరు కనుగొనక పోయినయెడల మీరేమి చేసి యుందురు? అది నాది. ఎవ్వరడ్డు వత్తురో రండు. ఈకత్తి తో మీ బుఱ్ఱపై నొక్కపెట్టు పెట్టెదను."

నీవు ప్రాణముల కాశించునెడల దూరముగ నుండు. అది నాపెళ్లాము. వెంకయ్యనను పేరుతో నంత తంతు జరుపుటవలనఁగాని యది సాధ్యమగునా? దూరముగను డు పట్టెద, నాను కూడపుచ్చుకొని, యింకను దానిని గూడ గిమ్మనుచున్నావా? దానిని నేనియ్యను. అది నాపెళ్లాము.

ఇట్లనుచుండఁగనే యిరువు రొక యాడుమనిషి నెత్తి కొనిపోవుచుండుటయు, వెంటఁబడి వారి నిరువురు తఱుముకొనిపోవుచుండుటయుఁ గాన నయ్యెను. ఈకలవర మంతయు నిశ్శబ్దముగా వినుచున్న వెంకయ్య యను పేరు చెప్పుకొనిన యాతఁడు దగ్గఱ నున్న చేతికఱ్ఱ వేసికొని పరుగెత్తెను. ఇతఁడు వచ్చుచున్నజాడఁ గనిపెట్టి ముందువారినిఁ దఱుముకొనిపోవుచున్న యిరువురను చల్లఁగ నదృశ్యులైరి.

ఈపురుషుఁడు కొంతదూర మరుగు నప్పటికి వారొత్తి కొనిపోవుచున్నది యొకస్త్రీయని గ్రహించి 'దొంగలు, దొంగలని బిగ్గఱగ నఱచెను. ఆయఱపులకు భాగవతపు టూటలోఁ గలవర ముదయించెను. వెంటనే కాపువారును, కమ్మవారును తూర్పువారును గొందఱు కఱ్ఱలు భుజమున వేసికొని పఱుపు లెత్తిరి. వారిలో సుందరశివరావుగారు కూడ నుండిరని చెప్ప మఱచితిని. వీరందఱు వెళ్ళునప్పటికా స్త్రీ నచ్చట బడవైచి యాయిరువురు దుర్మార్గులు పాఱిపోయిరి. కాని పోలీసువారు పరుగులెత్తి వెంటాడించుటచేత నాయిరువురును వారికిఁజిక్కుట సంభవించెను.

ఆస్త్రీఁ దేటి పాటఁజూడసరి కామె గంగమ్మ యయ్యెను. నోట గుడ్డలు కుక్కఁబడియుండెను. శరీరమంతయుఁ గాలు సేతులు సైతము త్రాళ్లతోఁ గట్టబడియుండెను. ఆమెను జూచినంతనే యాపురుషుఁడు వెంకయ్య—మొనటి వెంకయ్యయే, యబద్ధపువెంకయ్యయు దొంగలని యఱచిన యంతదేఁ జగమైన వెంకయ్యయు నగుటచే యథార్థనామముతోనే యాతనిం బిలుచుచుందము—"బాపురు"మని యేడ్చెను. ఈ సంగతి యంతయుం దెలిసి యత్తగారు మాన్నగువారు వచ్చి గంగమ్మను జూచి విలపించి, యింకఁ దీర్థములకు రాకూడదని తీర్మానింపఁ జొచ్చిరి. తరువాత వారు గంగమ్మ కట్లువిప్పి, నోటిలోఁ గుక్కఁబడిన గుడ్డల నెల్ల దీసివేసి, యామె కిన్ని గఁజితెళ్ళుపోసిరి. అవి యొంటఁ బట్టినతరువాత నా సొమ్మసిలిన ప్రాణి కొంచెము తేరికొని కన్నువిచ్చి చూచి తనముందు

గూర్చుండియున్న తనయత్తగారిని గాంచియు, మగనిం గాంచియు, తక్కుంగల బంధు జనంబును జూచియు వా విడిచి యేడువ సాగెను.

అప్పుడు దొరకిన యాయిరువురు దొంగలను కనిస్టేబిలులవశము చేసి, సుందరశివరావుగా రచ్చటికి వచ్చి వెంకయ్యను బలుకరించిరి. అప్పు డతఁ డాయనకు నమస్కరించి 'అయ్యా! ఈమెయె నాభార్య. మీదయవలన జీవముతో దొరకినది.' అని రోజుకొనఁ జొచ్చెను. కాని యామె యొడలిమీఁద నుండిన నగ లన్నియుఁ దుదకు మట్టెలు సైత మా దుర్మార్గులవశ మయ్యెను.

అటు తరువాత దొరకిన యాయిరువురు మోసకాండ్ర మీఁదను సుందరశివరావుగారు వెంకయ్యచేత కేసు తెప్పించి యాయిరువురిని ఖైదు చేయించిరి. కాని నగలు మాత్రము వారికి దొరక వయ్యెను. ఈకేసును తానే పట్టుకొంటినని వాడిచేఁ బలికించి, సుందరశివరావుగారు వాడినుండి కొంత సొమ్మేగాక గవర్నమెంటునుండి కొంత ప్రమోషను గూడ నంపాదించుకొనిరి. జీవముతోఁ గంగమ్మ దక్కినందుకే వెంకయ్య మున్నగువారు సంతసించిరి.

ఖైదుశిక్ష పడిన యాయిరువురు నొక్కొకప్పుడు తాపీగ, నాచెఱసాలలోఁ గూర్చుండి అసలు మోసముచేసిన వెంకయ్య, ఎక్సైజ్ రామయ్యగాని, నగలు దొంగిలించిన యాతని పినతండ్రి కొడుకు బాపన్నగాని పట్టువడక తుదకు

వారికి మద్దతు అయిన తాము పట్టుబడితి మేమనియు, తమకు శిక్ష వచ్చిన దేమనియుఁ దమలోఁ దాము చెప్పుకొని నవ్వుచుందురు.

ఇప్పటికి నా 'బటాచోరు' మోసకాండ్రగు రామయ్య బాపన్నలు కనిపించనే లేదు. పాఠకులారా! మిమ్ములను గూడ వా రేతీర్థముననైన, నే యుత్సవసమయముననైన మోసము చేసెదరనుసుమీ! భద్రముగ నుండుఁడు. వారింత వఱకు పట్టుపడక పోవుటచే మీకిట్లు సలహాపూర్వకముగ జెప్పవలసి వచ్చినది. ఇట్టిరామయ్యలు, బాపన్నలు తీర్థములందు వేనవేలు తిరుగుచుందురు. జాగ్రత.

చాలసంవత్సరములవఱకు వాకమట్టిలోనునవ్వులగుంటలోను నీకథ చెప్పుకొనుచు ప్రజలు 'పట్టపగలే యెంతటిఘోరములు జరుగుచున్నవయ్యా! ఘోరకలి — మునిగిపోవుచున్న' దని వెఱపొందుచు నీ గంగమ్మను నిన్న మొన్నటివఱకు 'అంతర్వేది గంగమ్మ,' యని హాస్య మొనరించుచుండువారు. గంగమ్మ యిప్పటికి పెద్దదైనది. ఇప్పటికినామెను 'అంతర్వేది గంగమ్మ' యనిన బట్టరాని కోపము వచ్చును. వాకమట్టిలోను, నవ్వులగుంటలోను నున్నపుడు పిల్లకాయలామెకోపమున్నదాచి యామె కనిపించినపుడెల్ల నాపేరుతోనే యామెను బిలిచి యెగతాళిసేయుచు నుడికించుచుందురు.

# జాతీయ సారస్వత నిలయము.

రాజమహేంద్రవరము.

ఇందు భారతవర్షముయొక్క ప్రాచీన ఔన్నత్యమును, నాగరికతను, ఆర్యవిజ్ఞానమును వెల్లడించు రాజకీయ, మత, సాంఘిక, విద్యావిషయక గ్రంథములును, మహాపురుషుల చారిత్రములును రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును. అందు ముఖ్యముగ ఆంధ్రదేశమునకు సంబంధించిన గ్రంథరాజముల నెక్కువగఁ బ్రకటింపఁ బ్రయత్నింపబడును. పాఠకుల వినుకిడంబాపుటకై నవమవనవమ చారిత్రకగ్రంథములు వెలువడుచుండును. చారిత్రిక నవల ముఖ్యముగ ఆంధ్రదేశమునకు సంబంధించునదియై యుండును. సాంఘిక నవలులును, కథలును అనుబంధముగఁ బ్రకటింపఁబడును. ప్రతి గ్రంథము నూరుపుటలకు పోస్టేజి కాక 0-8-0 చొ॥ ఈయబడును. మొదటి నుండియు ప్రకటింపఁబడిన గ్రంథములు తిసి కొనని వారు మాత్రము 8 అణాలు ప్రవేశరుసుము చెల్లింపవలెను



సంవత్సరమున కభిమానులకు రు 12/-లు, పోషకులకు రు 25/-లు. ప్రతిగ్రంథము క్యాలికో బైండుచేసి అభిమానులకు, పోషకులకు ఒక్కొక్కప్రతి యీయఁబడును. ప్రత్యేకముగ చరిత్రాత్మకగ్రంథములను బ్రకటించు నిలయము ఇప్పుడు మనయాంధ్రదేశమున నిదియొక్కటియే కలదు. ఆంధ్రపాఠకమహాశయులు, ఈనిలయమునకు దగిన యాదరాతిశయములు చూపఁబ్రార్థితులు.

చదువుఁడు !
మనపూర్వుల శౌర్యము !

చదివి యానందింపుఁడు !
మనపూర్వుల వైభవము !

# ఆంధ్రవీరులు

(ప్రథమ భాగము)

---

గ్రంథకర్త:—శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

పూర్వము ఆంధ్రులు మహారాష్ట్రులవలెను, బంగాళీలవలెను అమితమైన శౌర్యసాహసములను జూపి తమశక్తియుక్తులచే, రాజ్యతంత్రనైపుణ్యముచే పెక్కుయుద్ధములు జయించి, పెక్కు నగరములు కట్టించి, సామ్రాజ్యములు స్థాపించి రాజులై, మహారాజులై, చక్రవర్తులై, మహామాత్యులై, మహాసేనాధిపతులై విలసిల్లి, ఇప్పటి యాంధ్రులకు కీర్తిభిక్ష పెట్టియున్నారు. అట్టిమహనీయుల జీవితచారిత్రములు వారివైభవోన్నతికి దగిన సరసశైలి యందు వర్ణింపబడినవి. శాతకర్ణి చక్రవర్తి, కులోత్తుంగ చోడదేవచక్రవర్తి, ప్రతాపరుద్రచక్రవర్తి, ఖడ్గతిక్కన, బ్రహ్మనాయుడు, రాణీరుద్రమదేవి, రాయనిభాస్కరుడు—వీరిచారిత్రములు చదువునప్పుడు ఒడలు పులకరింపక మానవు. ప్రతిపుటయందును, ఆంధ్రుల ప్రాచీనవైభవౌన్నత్యపరాక్రమములు ప్రతిఫలించుచున్నవి! చదువుడు. చదివియానందింపుడు !

(పోస్టేజికాక) వెల: చందాదారులకు 1—0—0
ఇతరులకు 1—4—0

